సంకలనం : మురళీధరరావు

1. పురుష - నిర్వచనము
2. సూక్తము
3. భాగవతంలో విరాట్ పురుషోపాసన ఉంది.

విరాట్ పురుషోపాసన చతుర్వేదసారం.
భాగవతంలో "బ్రహ్మ నారాయణ సవాదం" గా ప్రసిద్ధి చెందింది.

బ్రహ్మ నారదునకు ఉపదేశం

కథ:

అది ప్రళయం. సర్వ భూతాలూ లయమయ్యాయి. బ్రహ్మ క్షణం ఆలోచించాడు. ధ్యానం చేసాడు. ఆ సమయం తెల్లవారు జాము. ఒక ముహూర్త సమయం.

దానినే "బ్రాహ్మీ ముహూర్తం" అంటారు.
బ్రహ్మ ఆయుర్దాయం100 సంవత్సరాలు. ఇది దేవకాలమానం. మానవులది కాదు. మానవులనూరేళ్ళు కథ వేరుగా ఉంటుంది.
మంచి ఆలోచన వచ్చింది. ఆలోచన వచ్చినతోడనే (4) నలుగురు కుమారులు సంకల్పంతో జనించారు. వారే సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు. వీరే బ్రహ్మ మానస పుత్రులు. నారదుడు కూడా బ్రహ్మ మానస పుత్రుడే. అందరికంటే చిన్న. తండ్రి దగ్గర చేరాడు.
"ఆత్మజ్ఞానము"
భిక్షగా పెట్టుమన్నాడు.
ఇంకా ఈ సృష్టి ఏంటి?
ఎలాపుట్టింది?
ఎక్కడ లయమవుతోంది?
ఈ ప్రపంచ స్వరూపం ఏంటి?
భగవంతుడు ఎవరు?
ఇదంతా ఎలా జరుగుతోంది?
మీరే పంచభూతాలను సృష్టిస్తున్నారే!
సర్వ సృష్టి మీ వలననే జరుగుతోందే!

"సాలెపురుగు తనలోంచి దారాన్ని తీస్తోంది. దానిలో చిక్కుకుపోతోంది.

మీనుంచే పంచభూతాలూ సృష్టింపబడుతున్నాయి. జగత్తు మీ చుట్టూనే ఉంది. మీలో ఏ మార్పూ లేదే! పైగా సర్వ కారణభూతులు మీరు ధ్యానం చేస్తున్నారేంటి?

మీ కంటే పెద్ద ఉన్నారా! ఎవరు వారు? అని అడిగాడు.

దీనికి బ్రహ్మ చెప్పిన సమాధానమే బ్రహ్మవిద్య.

## బ్రహ్మ విద్య

కుమారా! నాలో అంతర్యామి ఉన్నాడు. ఆ అంతర్యామి యైన భగవంతుడు " నా బుద్ధిని మేలుకొలుపుతున్నాడు. ఆయన శక్తియే ఇది.

ఆ అంతర్యామి ని తెలుసుకోవాలని ధ్యానంచేస్తున్నా. చేస్తుంటే అపుడు తెలిసింది నాకంటే గొప్ప శక్తి ఉందని.

అది తెలుసుకునే వరకూ సర్వానికీ నేనే కారణం అనుకున్నా. అపుడు నాకు తెలిసింది.

అమ్మా! మాయ నా కళ్ళు కప్పింది. అందుకు తెలిసికోలేకపోయా. భగవంతుని అని.

ఓసినీ! నీకాశక్తి ఎక్కడిది? అని ఆలోచిస్తే "త్రిగుణాత్మకం మాయ" దాని ప్రభావం. అందుకే అందరూ భగవంతుని దర్శించ లేకపోయారని పించింది. మాయ తొలగితే గాని భగవంతుడు కనిపించడు అని అర్థమైంది. ఇక ఆ భగవంతుని గూర్చి తెలుపుతా. విను.

## భగవంతుడు

1. కాలం 2. స్వభావం 3 . కర్మ 4. జీవుడూ ఈ నాలుగూ భగవంతుని రూపాలే. ఆ భగవంతుడు నారాయణుడే. ఆయన వేద పురుషుడు. ఆయన శరీరం నుండి లోకాలన్నీ పుట్టాయి.
2. లోకపాలకులు పుట్టారు.
3. దేవతలూ, సర్వజీవాలూ ఆయననుండే పుట్టారు. నీకూ, నాకూ కూడా ఆయనే ప్రభువు.
4. భగవంతుని ప్రేరణచేతనే పిండాండం, బ్రహ్మాండం పుట్టాయి. పిండాండమే బ్రహ్మాండం. బ్రహ్మాండమే పిండాండం.

## బ్రహ్మాండం - నిర్మాణం

5. భగవంతుడు మాత్రం నిర్గుణుడు. తానే తనలోని కాలం, కర్మ, స్వభావం తీసుకొని బ్రహ్మాండం నిర్మించాడు.
6. బ్రహ్మాండం బాగా పెరిగింది. దానిలోంచే విరాట్పురుషుడు పుట్టాడు.

## విరాట్పురుషుడు

1. విరాట్పురుషునియందే చతుర్దశభువనాలు.

   7 ఊర్ధ్వలోకాలు,
   భూలోకం 2. భువర్లోకం 3 సువర్లోకం 4. మహాలోకం 5. జనోలోకం 6. తపోలోకం
   7.సత్యలోకం

2. 7 అధోలోకాలు ఉన్నాయి.
   అతల, వితల సుతలాది సప్తాలు.

3. శిరసు - సత్యలోకం
4. నాభి - అంతరిక్షము - భువర్లోకం
5. చెవులు - దిక్కులు
6. పాదాలు - భూలోకం

ముఖం - అగ్ని

## సప్త ధాతువులు - సప్త ఛందస్సులు

1. త్రిష్టుప్ 2. అనుష్టుప్ 3.ఉష్ణిక్ 4. బృహతి
   5. పంక్తి 6.జగతి 7. గాయత్రి.
2. చెవులు - ఆకాశం
3. ముఖము - హవ్య కవ్యాలు,ఆహారాలు
4. నాలుక - వరుణ దేవత
5. ముక్కు - పంచ ప్రాణ వాయువులు
6. ముక్కు రంధ్రాలు - అశ్వనీ దేవతలు, పరిమళాలు
7. కళ్ళు - సూర్యుడు, ద్వాదశాదిత్యులు
8. చర్మము - వాయువు
9. రోమాలు - దర్భలు, వృక్షాలు, ఓషధులు, మేఘాలు
10. ఎముకలు - పర్వతాలు
11. రక్తనాళాలు - నదులు
12. సప్తధాతువులు - సప్తలోకాలు
13. సర్వాంగాలు - సర్వధాతువులు

## దేవతా జననము

1. శరీరం - దేవతలు
2. ముఖం - ఇంద్రాగ్నులు
3. ప్రాణం - వాయువు
4. నేత్రాలు - సూర్యచంద్రులు
5. మూత్రద్వారము - బ్రహ్మ
6. మలద్వారం - మృత్యువు
7. హృదయం - లక్ష్మి
8. నాభి - నేను (బ్రహ్మ), సనకసదనాదులు.
   మానవుల పుట్టుక
9. ముఖం - బ్రాహ్మణులు
10. భుజాలు - క్షత్రియులు
11. తొడలు - వైశ్యులు
12. గంగజనించిన పాదాలు - శూద్రులు

ఇక మిగిలిన రకరకాలసృష్టి యంతా దశాంగుళ న్యాయంలో " విరాట్పురుషు" నిలో ఉంది.

## దశాంగుళ న్యాయము - వివరణ

భూమి> 10 రెట్లు జలం > 10 రెట్లు అగ్ని > 10 రెట్లు వాయువు >10 రెట్లు ఆకాశం >10 రెట్లు మహత్> 10 రెట్లు >మూల ప్రకృతి.

ఇదంతా భగవంతునిలో ¼. మాత్రమే.

లోకాల ఉనికి

మనది కర్మభూమి. కర్మల వల్ల పాపపుణ్యాలు.

పుణ్యం

సత్కర్మ - పుణ్యం- స్వర్గం
తపస్సు - తపోలోకం

- బ్రహ్మచారులు, వానప్రస్థులు - సన్యాసులు - జన. తప, సత్యలోకాలు
- గృహస్థులు>భూః భువః సువః లోకాలగమనం

- బ్రహ్మసాక్షాత్కారము - సత్యలోకం

ఉపాసనా మార్గాలు

1. కర్మయోగం - గృహస్థులు
2. 2. జ్ఞానయోగం - సన్యాసులు.

## సృష్టి - యజ్ఞభావన

విరాట్పురుషుని నాభికమలం నుండి నారదుడు, సనక,సనందనాదులు జన్మించారు.

నారదుడు యజ్ఞం చేయాలని తలచాడు. సామగ్రి లేదు. విరాట్పురుషుని వర్ణించిన అవయవములే యజ్ఞపరికరంగా చేసికున్నారు. విరాట్పురుషుడే యజ్ఞం. ఆయనయందు వాటిని ఆహుతి చేసారు.

యూపస్తంభం, యజ్ఞభూమి, యజ్ఞపశువులు, యజ్ఞరూపమైన సంవత్సరం, స్రుక్, స్రువాదులు, ఓషధులు, ఆజ్యం, నెయ్యి, పెరుగు, జలం, నవధాన్యాలు, చతుర్వేద యజ్ఞవిధులు, ప్రాయశ్చిత్తాదుల తో యజ్ఞపురుషుని నారదుడు విరాట్పురుషుని ద్వారా యజ్ఞం చేసాడు నారదుడు.

(బ్రహ్మ నారదునితో చెప్పే మాటలు)

నారదుని అన్నలు సనకసనందనాదులు, దశ ప్రజాపతులు యజ్ఞపురుషునినుండి జనించి, అంతర్యామి అయిన విరాట్పురుషుని ఆరాధించారు.

ఆ యజ్ఞంలోనుండి మనువులు, దేవతలు, ఋషులు,పితరులు, మానవులు కూడా జన్మించారు. అందరూ ఆత్మయజ్ఞం ద్వారా విరాట్పురుషుని ఆరాధించారు.

అందులో మానవులు మాత్రం భూమిమీద ద్రవ్యాలతో యజ్ఞాలు చేస్తారు.

నేను (బ్రహ్మ) మాత్రం విరాట్పురుషుని ప్రేరణ చేతనే సృష్టి చేస్తున్నాను.

## త్రిమూర్తుల సృష్టి

1. విరాట్ పురుషుడే త్రిగుణాలతో  మమ్ము త్రిమూర్తులను సృష్టించాడు. ఇదంతా విరాట్పురుషుని ప్రేరణయే.

***2. మనువులరూపంలో మానవులను***

***3. ఋషుల రూపంలో బ్రహ్మ విద్యను, శాస్త్రాలను సృష్టించి, ధర్మ రక్షణ చేసాడు.***

***4. ధర్మగ్లాని యపుడు ఆయనే అవతరించాడు. అట్టి ఆయనను జీవులు పొందదగిన "పురుషోత్తమ ప్రాప్తి యోగం"***

***"గీత 10 - 11 - 15"***

***ఇదియే "పురుషసూక్త రహస్యం".***



++++++++++++++++++++++++++++++++++++++++(++++++++++++++++++++

## దేహంలో విరాట్పురుషోపాసన

***" దేహో దేవాలయః ప్రోక్తః జీవో దేవః సనాతనః|***
***త్యజేత్ అజ్ఞాననిర్మాల్యం సోహం భావేన పూజయేత్" అని మహాన్యాసము వచించింది.***

దేహమే దేవాలయము. అందున్న జీవుడే దేవుడు. నేను, నాది అనే దేహ భావన విడచి, "***అహం బ్రహ్మాస్మి***"అని అనుభూతిలో ఉండి పోవడమే అంతర్యాగము. పురుషసూక్త రహస్యము.

***పిండాండమే బ్రహ్మాండము. బ్రహ్మాండమే పిండాండమనే ఏకత్వ అద్వైత భావన.***

***శరీరంలో ఉన్న జీవుడే పిండాండము.***
***విశ్వమంతా నిండిన ఆత్మ స్వరూపము బ్రహ్మాండము.***
***ఈ రెండూ ఒకటే అనే అద్వైత భావన ప్రయత్నమే పురుషసూక్త పరమార్థము.***

### మాయ

ఆ భావనలో నిలచిపోవడానికి "***మాయ***"
అడ్డుగా ఉంటుంది. మానవుని మనసును నిరంతరం ప్రపంచవాసనల వైపు మళ్ళిస్తుంటుంది." ***నేను విరాట్పురుషుణ్ణి"*** అనే భావన చాలదు. ఆత్మనిష్ఠుడై ఉండాలి. అందు రమిస్తుండాలి.

### రాజ విద్య

మనసుకు లొంగకూడదు. బానిస కాకూడదు. ఈ దేహ సామ్రాజ్యానికి "**ఆత్మ**" యే "**రాజు**" గా నిలబడాలి. ఆత్మ అనే రాజు ఉపాసన చేయాలి. ఆత్మయే పరమాత్మ. "**విరాట్**" అదే విరాడుపాసన. ఇదే రాజవిద్య.

ఈ విద్యను ***సూర్యుడు*** నారాయణుని నుండి ఉపదేశం పొందాడు.
సూర్యుని నుండి (తండ్రి) "వైవస్వత మనువు" ఉపదేశం పొందాడు.
సూర్యునిలో ఉన్న ఆదిత్యుని సహస్రశీర్షోపాసనయే " పురుష సూక్తం". ఇది రాజవిద్య. రాజయోగం.
***దీనిని అనుభవించిన మానవుడు సామ్రాట్టు.***

***ఇంద్రియాలు, మనసు, మొదలగు అంతఃకరణాలకు ఆత్మ లొంగకుండా ఉండడమే "ఆత్మ సామ్రాజ్యం"***
***ఇలా బానిసత్వం నుండి విముక్తుడైన పరిపూర్ణ మానవుడే "మనువు"***

## ***విరాడ్రూపోపాసన***

***మానవత్వ పరిధి దాటి, మానవునిలోని గ్రహాలను కూడా జయించి, దేవతలైన వారు "బృహస్పతి, శుక్రుడు, సూర్యుడు" మొదలగు వారు. అందుకే మనం వారిని దేవతలుగా ఆరాధిస్తున్నాం. ఇలా మానవులు సాధన చేసి, ఇంద్రత్వం, దేవత్వం, బ్రహ్మత్వం పొందవచ్చు.***

***ఇలా దేహంలో ఒక దేవతను గాక సమస్త దేవతలను అంతర్ముఖంగా ప్రయాణించి, ఉపాసించడమే "విరాడ్రూపోపాసన". ఇదే పురుషసూక్త రహస్యము.***

**@@@@@@@@@@@@@@@@@**

## ***మన శరీరంలో విరాట్ -1***

మానవ శరీరం సహజంగా 96 అంగుళాలు ఉంటుంది.అనగా 96÷12= 8 అడుగులు అత్యధికం.

## ***నాడీవ్యవస్థ***

అందు వెన్నెముక " మేరువు".
మలమూత్ర ద్వార మధ్య ప్రదేశం " మూలాధారం. అది ఒక తామర దుంప. అక్కడి నుండి దేహమంతా వ్యాపించి, 72,000 నాడులు ఉంటాయి. అందు ముఖ్యం 14 నాడులు.
ఈ నాడులకు, 14 తిథులకు సంబంధం ఉంటుంది. ఈ తిథ్యధిపతులే చతుర్దశ మనువులు. నాడులు వరుసగా 1.పింగళ 2. ఇడ 3.సరస్వతి. 4.పూష. 5. వరుణ. 6. సప్తజిహ్వ 7.యశస్విని 8.అలంబుస 9. కుహూ 10.విశ్వోదార.11.పయస్విని 12.శంఖిని 13.గాంధార 14. సుషుమ్న.

ఇందు ఇడకు చంద్రనాడి, పింగళ సూర్యనాడి. సుషుమ్నాగ్నినాడి. వీటికి వరుసగా (ఇడ) విష్ణు, రుద్ర(పింగళ), బ్రహ్మ (సుషుమ్న)లు అధిపతులు.

సుషుమ్నయే మోక్షమును ప్రసాదించే నాడి. ఇది బ్రహ్మ, విష్ణు, రుద్ర గ్రంథులను భేదిస్తూ, షట్చక్ర వికాసం కలిగించి, కుండలినిని, ఆత్మశక్తిని, ఓజస్సు, బ్రాజో రూపాలు పొంది, సూర్య,చంద్ర, అగ్ని సమ్మిళితమై మెరుపు రూపంలో ఊర్ధ్వంగా పయనించి, సహస్రార పురుషుని చేరి,పురుషోత్తమప్రాప్తి కలిగిస్తుంది. ఇది ప్రయాణించే సుషుమ్న(బ్రహ్మ)మార్గంలో సప్త వ్యాహృతులు "***ఓంభూః భువః సువః మహః జనః తపః సత్యమ్"*** ఉన్నాయి. శరీరంలో అంతర్లోకాలు ఇవి.

ఈ 14 నాడులకు 14 మంది అధి దేవతలు ఉంటారు. వీరు నాడీ దేవతలు.

## *దేహావయవాలు - దేవతలు*

*1.హృదయం - బ్రహ్మ*
*2. ముఖం - అగ్ని*
*3.వాక్కు - ఇంద్రుడు*
*4.శ్వాస - వాయువు*
*5. మనసు - చంద్రుడు*
*6.లింగము - ప్రజాపతి*
*7.వృషణములు - మిత్రావరుణులు*
*8.నాలుక - జలదేవత వరుణుడు*
*9.పాదాలు - భూమి*
*10.నాభి -అంతరిక్షము*
*11.చెవులు - దిక్కులు*
*12.శిరము - బ్రహ్మ పగలు.*
*ఇలా దేహం దేవతామయం.*

## *శరీరం లో సంవత్సరం - 2*

*"యజ్ఞః సంవత్సరః" యజ్ఞాన్ని సంవత్సరము అంటారు. "యజ్ఞో వై విష్ణుః" యజ్ఞము విష్ణు స్వరూపము అంటారు.*

*శరీరంలో సూర్యుడే ప్రాణము. శరీరంలో సూర్యసంచారమే సంవత్సరం లోని సూర్యుని గమనము.*

## *ఉత్తరాయణ-దక్షిణాయనములు*

*1.శరీరంలో ప్రాణం (సూర్యుడు) పింగళనాడిలో సంచరిస్తే "ఉత్తరాయణము".*

*2.ఇడా నాడిలో ప్రాణవాయువు సంచారమే " దక్షిణాయనము".*

## *అమావాస్య -పౌర్ణమి*

*3. ఇడా, పింగళలలో ప్రాణం సంచరించకుండడమే "అమావాస్య"*
*4. ఇడా,పింగళులలో ప్రాణం పూర్తిగా నిండియుంటే అది "పౌర్ణమి".*

## చంద్ర - సూర్య గ్రహణములు

1. ప్రాణవాయువు ఇడానాడి నుండి కుండలిని స్థానాన్ని చేరితే "చంద్ర"
2. పింగళనాడినుండి కుండలినిని చేరితే "సూర్య గ్రహణము"

కుండలిని రాహురూప సర్పం, చంద్ర,సూర్య నాడులవల్ల ప్రాణవాయువు కుండలినిని చేరితే "చంద్ర-సూర్య" గ్రహణములు.

## పురుషోపాసన

ఆత్మయే పురుషుడు.

ఋగ్వేదం - ప్రజ్ఞానంబ్రహ్మ
యజుర్వేదం - అహంబ్రహ్మాస్మి
సామవేదం- తత్త్వమసి
అథర్వణవేదం - అయమాత్మా బ్రహ్మ

ఇలా నాలుగు వేదాలు పురుషుడినే బ్రహ్మ గా, ఆత్మ స్వరూప శరీరములో భావన చేయాలని చతుర్వేదసారము. ఇదే దేహంలో పురుషసూక్తోపాసన.

## సూర్య గమనము

ప్రాణ వాయువు(సూర్యుడు) క్రిందనుండి పైకి ఆరు చక్రాలలో,
మరలా పైనుండి క్రిందకు మరల ఆరు చక్రాలలో సంచరించుటయే 12 రాశులలో సూర్య గమనము. ఇదే శరీరంలో కాల రూపసంవత్సరం. సంవత్సరమే యజ్ఞం. యజ్ఞమే విష్ణువు. ఇదే "దేహో దేవాలయో ప్రోక్తః జీవో దేవః సనాతనః"

మన దేహమే ఆలయం. ప్రాణమే సూర్యదేవుడు. ఆ ఉపాసనే దేహంలో " పురుషసూక్తోపాసన".

దేహంలో కుడివైపు ప్రాణ సంచారం దేవతల మార్గం

ఎడమవైపు ప్రాణసూర్య సంచారం పితృదేవతల మార్గం.

ఈ విషయం ప్రాచీన వైద్యులు, చేయి చూసి, నాడీ సంచారాన్ని బట్టి దేహవాతావరణాన్ని సూచించేవారు. వ్యాధి నిర్ధారణ చేసేవారు.

## ఏడుచక్రాలు - ఏడు గ్రహాలు

1.మూలాధారం > శని
2.స్వాధిష్ఠానం> చంద్రుడు
3.మణిపూరకం >బుధుడు
4.అనాహతం> సూర్యుడు-ఆత్మస్థానీయుడు
5.విశుద్ధి>శుక్రుడు
6.ఆజ్ఞ > గురువు
7. సహస్రారం> కుజుడు సుబ్రహ్మణ్య స్వామి
8,9. కుండలినీమూలాధారంలో ఉంటే రాహుకేతువులు..
మూలాధారం నుండి పైకి ఊర్ధ్వలోకాలు
క్రిందకు అధోలోకాలు.

## ప్రాణాయామం

౧. జలంతో ఆచమనం చేస్తాం. జలం నారాయణ రూపం.ఆ నారాయణుని సమంత్రకంగా లోపలకు ఆహ్వానం.

౨.ప్రాణమంటే బయట సూర్య శక్తిని, హృదయంలోని ఆత్మపురుషుని కలుపుతాం.
విశ్వ ప్రాణాన్ని, జీవప్రాణంతో సమ్మేళనం గావిస్తాం. ఇది ***జీవేశ్వరులను ఏకం చేసే ఆధ్యాత్మిక ప్రక్రియ.***